శ్రీరస్తు.

శ్రీవేంకటేశ్వరస్వామినే నమః.

తాళ్లపాక. చిన్నన్నగారిచేత

లోకనీతిప్రతిపాదితముగా రచియింపబడిన

# వెంకటేశ్వరశతకము.

ఇది,

పండితులచే పరిష్కరింపబడి.

శ్రీమాన్. భద్రాచలం- తిరుమల

పం. శ్రీ, కాకుళాచార్యులు అనఘ బ్రవర్సువారి

శ్రీవాణీనికేతనమందిరముద్రాక్షరశాలయందు

సలకా. శ్రీనివాసులు సెట్టిగారిచే

ముద్రింపించి ప్రచురింపబడియె.



MADRAS.

1889.

శ్రీరస్తు.

శ్రీవేంకటేశ్వరస్వామినేనమః.

తాళ్లపాక. చినన్నగారిచేత

లోకనీతిప్రతిపాదితముగా రచియింపబడిన

# వెంకటేశ్వరశతకము.

ఇది,

పండితులచేపరిష్కరింపబడి.

శ్రీమాన్, భద్రాచలం- తిరుమల

పం. శ్రీ, కాకుళాచార్యులు అక్కడు బ్రహ్మచర్యువారి

శ్రీవాణీవినోదమందిరముద్రాక్షరశాలయందు

సలకా. శ్రీనివాసులుసెట్టిగారిచే

ముద్రింపించి ప్రచురింపబడియె.



MADRAS.

1889



శ్రీ.

శుభమస్తు.

# వేంకటేశ్వరశతకము.



(౧.) సీ॥ శ్రీదేవియురమున శిరసునతులసిభూ కాంతవీపునపదా గ్రమున గంగ । కమలాసనుఁడునాభి కాముఁడుమదినప సవ్యావ్యనేత్రంబు శశియురవియు । ధ్వజమునగరుడుండు తపనులుకాంతులు సకలవా యువులు నాసాపుటములు । జగములుకుక్షిని జలధులు వళులందు ఘనరోమములుదేవ గణములెల్ల । కలిగిశోభిల్లునీ మూర్తిదలచినీకు । సీసశతకంబు జెప్పెద చిత్తగింపు । కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ । విమలరవికోటి సంకాశ వేంకటేశ॥

లోకనీతివిషయము.

(౨.) సీ॥ ధర్మంబుగలచోట దలకొనుజయమెల్ల దయగలచోసుకృతంబు నిల్చు । సత్యంబుగలచోట సమకూరుశుభములు నేమంబుగలచో టునిల్చుసిరులు । పాడిగల్గినచోట పంతంబులీడేరు దాక్షిణ్యమున్న చోతగులుమైత్రి । భక్తిగల్గినచోట ఫలమిచ్చుదైవంబు మనసుగల్గి నచోట మలయుసుఖము । యితరమగుచోట వెదకిననేలకల్గు । సారదినీదైనకృపగలచోటగాక॥ కలిత॥ ❋

(3.) సీ॥ తపసికినేటికి దలపోయరోషంబు బ్రాహ్మణునకునేల పాపచింత । బుద్ధిమంతునకేల పొసగనిసౌఖ్యంబు పరమయోగికినేల ప్రజలరచ్చ । మహిరాజునకునేల బహుజనద్వేషంబు కార్యవంతునకేల కడుచలంబు । కీర్తికామునకేల కెరలినలోభంబు మంచివానికినేల మంకుగుణము । కీడుమేలునుమదివి తర్కించిచూచి । భవ్యగుణముల మిముగొల్చి బ్రతుకవలయు॥ కలిత॥

(౪.) సీ॥ పరమనాస్తికునకు భక్తివాదములేల షండునకేటికి సతులపొం
దు । పాపాత్మునకేల పరపురుషార్థంబు ధనలోభికేల బాంధవము
చింత । మూర్ఖునకేటికి మొదలనె మొగమాట మనృతవాదికిని
మర్యాదలేల । వెఱ్ఱివానికి నేల విమలవిచారంబు పరమూషకునకేల
పరమచింత । సరసునకుగాక వివరింప సద్గుణంబు । లెంచుటాచిన
మూఢులకేలగల్గు ॥ కలిత॥ *

(౫.) సీ॥ మరణంబు లేకుండ మందుచేగల్గిన కాలునకేటికి కలఁగిపార ।
ప్రాయంబుచెడని యుపాయంబుగల్గిన నెయ్యెడముదిమికి నేలతల
క । కామితార్థములిచ్చు కామధేనువుగల్గ కరువునకేటికి వెరచియొ
దుగ । వజ్రదేహంబుగా వరముసిద్ధించిన శస్త్రాస్త్రములకేల జల
ధరింప । శరణుజొచ్చినయటువంటిజనులకెల్ల । కావఁబ్రోవంగ దా
తవుకలవునీవు॥ కలిత॥ *

(౬.) సీ॥ గడుసరి తాటోటు కష్టువేడుక గాని కలహప్రియునిధూర్తుకప
టచిత్తు । సుంకరిజూదరి జూటు ననాచారు మనిమచ్చు చలపాది
మొండియవిడుపు । కుత్సితునపకారి కుటిలాత్మువివేకి కయ్యలాటకా
ని టక్కరితుటారి । వేటకానిబిసాళి వెఱ్ఱినవ్వులపోతు మాయధా
రుని చోరు మద్యపాని । కరవలవదు మఱిపొందు సేయతగదు । మా
నవులకర్థితో కలలోననైన॥ కలిత॥ *

(౭.) సీ॥ ధరజీవతాంలఁగా ద్రవ్యసక్తుడుగాక తొడిబడబ్రాహ్మణద్రోహి
గాక । చెలగిపతివ్రతా జనకాముకుఁడుగాక వ్యాధిమినగరకొండీఁ
డుగాక । గర్వంబుతోడనొక్కట మదాంధుడుగాక పరగనవిశ్వా
స పరుఁడుగాక । కుటిలవర్తనమున క్రూరచిత్తుడుగాక సకలశా
స్త్రములందు జడుడుగాక । మెలగనేర్చినయట్టి ధార్మికులకెందు ।
కల్గుసుఖములు నీకటాక్షంబు వలన॥ కలిత॥ *

(౮.) సీ॥జలకంబుతఁ బాటి జపముసేవార్చన బ్రాహ్మణసేవ పురాణగోష్ఠి।
దానంబుచోరశాస్త్రవః గ్రహాముచింత స్వజనకజ్ఞాశ్వర ఋణముగ
ణన। యాప్తమంత్రిపురో హితాలోచనంబును రాజ్యాదిధనవిచా
రంబుభక్తి। సంగీతసాహిత్య సౌఖ్యానుభవములు గూఢచారులకొ
ల్వగుప్తనిద్ర। సలుపవలయును ప్రతిదివసంబునందు। నయమెఱుం
గనయట్టి భూనాయకునకు॥ కలితలక్ష్మీశసర్వ॥ *

(౯.) సీ॥ కులమువారలకెయ్యకోలైనవిల్లాలు వరుసతోరక్షించువాఁడు
తండ్రి। ప్రియముతోచన్నిచ్చి పెంచినయదితల్లి తనకుతోడగువా
డు తమ్ముఁడరయ। ఆపదలెడబాపు నాతఁడెబంధుడు వంచనసేయని
వాడెభటుడు। మోక్షమార్గముజూపు ముఖ్యుఁడె యాచార్యుఁ డా
త్మకునిష్టమౌ నతడెసఖుడు। యెఱిగివీరలతోఁ బొందు సలుపవలయు,
గురుతెఱింగినసద్వివేకులకునెల్ల॥ కలిత॥ *

(౧౦.) సీ॥ఆసలువిడిచిన యాలమటలేలేవు నిర్ధనికుంజైన నిర్భయంబు। పర
హింసమానిన పాపమించుకలేదు భోగమొల్లకయున్న బుద్ధిచెడదు।
వెసపరాధీనత విడిచినముడిరాదు ధరఁగోరకున్న బంధంబులేదు।
మగువలరోసిన మరుబాధలడరదు మమతమానిన విచారములు లేవు
గాన సకలంబు దెలిసి ఘనత మెఱసి। చెలగ పురుషుడు మిగుల నిశ్చి
త్తుడరయ॥ కలిత॥ *

(౧౧.) సీ॥ వలవనివైర మెవ్వరితోడ కోరగాదు మెలగిధూర్తులయిండ్లు మె
ట్టజనదు। బుధులనుడాసిన బుద్ధిచూడగరాదు పాపంబుసొమ్మని ప
ట్టతగదు। బంధువిరోధంబు పాటింపజెల్లదు నేలికకెదురాడ నెపు
డువలదు। ఆత్మనమ్మినవారి నపహరించుటకీడు యనిమొనవోడిన
నదియెగొఱతో। పదరపనిలేమిఁకీర్తి సంపన్నుఁకును। బలిమినొయ్యో
ననానాట ప్రబలవలయు॥ కలిత॥ *

(౧౨.) సీ॥ ఆచారవంతుడౌ నతఁడె విప్రోత్తముం డఖిలంబు రక్షించు నతఁడె రాజు। వరుసతో కార్య నిర్వాహకుడే మంత్రి యుచితవర్తనుడె పురోహితుండు। కడుతిట్టదీవింప గలవాడె సత్కవి యమృతహస్తుడె వైద్యు డఖిలదిశల। పోటొజ్జ మెరిగిన పురుషుడె దళవాయి గణితజ్ఞుడగువాడు కరణ మరయ। పురుషరత్నము లనియండ్రు బుధులు వీరి। యితరులెల్లను సామాన్యు లెంచిచూడ॥ కలిత॥ ❋

(౧౩.) సీ॥ పలుమాఱు శపథముల్ పలికెడువాతడు పూటలు బడునట్టి బోటు కాడు। కూటసాక్షులకును గుఱియైనయాతడు నటయింటి వారితో నలుగునతడు। విభునిరహస్యముల్ వెలిబుచ్చునాతడు పరులచే లంచముల్ బట్టువాడు। కుడిచినింటికి చేటు గోరెడునాతడు మహోపకారంబు మరచువాడు। పడునధోగతి నిహమును పరము లేక। కొఱకునకు బోయి వడగండ్లు గూలుకరణి॥ కలిత॥ ❋

(౧౪.) సీ॥ ఇలయేటిదరిమాని కెప్పుడు చలనంబు నరనాథుపొరిగిల్లు నమ్మరాదు। పాముతోడుత పొందు పాటింపజెల్లదు దుర్జనసంగతి దూరుముట్టు। కడగిదయ్యముతోడి కాపురంబు కీడు మఱిబొంగతో పొందు మరణమొదవు। పరికింపనోడపై బ్రతుకుసందేహంబు ఘనునితో సరసంబు గాదు జరప। అరసి కానివివర్జించి యయినపనుల। నరుడు వర్తిల్ల వలయును నయమెలర్ప॥ కలిత॥ ❋

(౧౫.) సీ॥ ఏలికతో పాటు యేమినైనను మేలు తనయంతనున్న వచ్చినది మేలు। సజ్జనగోష్ఠి యెచ్చటనుండినను మేలు చిరపుణ్యమెంత చేసినను మేలు। నిజమాడ యెవ్వరు నిందించినను మేలు పరగనంతటితోడి బ్రతుకు మేలు। ధరణిపదార్థమై చరియించినను మేలు వినయంబు గల్గు జీవనము మేలు। దుష్టబుద్ధులు మెలగెడు త్రోవ వలదు। నయమెఱింగినయట్టిసన్మానికులకు॥ కలిత॥ ❋

(౧౬.) సీ॥ మావటీడునకుమై మరువరాదెప్పుడు యలయికకూడదు యాచకు
నకు । వేగులవారికి వేసటజెల్లదు జోగికికాణాచి చోటులేదు । వె
సహీనజాతికి వీరువారనిలేదు వెట్టివానికికూలి వేడతగదు । జాజర
గానికి సంకోచపడరాదు మొగమాటదూతకు తగవుకాదు । తగిలి
తమ తమవర్తన తగిన పాటి । నేర్చినటువలె బ్రతుకుట నీతి యం
డ్రు॥ కలిత॥ *

(౧౭.) సీ॥ తనభక్తినిజమైన దైవంబు మెచ్చును మనసొక్కటైనను మలయు
సుఖము । మంచిదియైనను మహియెల్ల వశమౌను సాహసియైనను
త్సాహమొదవు । బుద్ధిపూర్వకమైన భువియెల్ల నేలును బ్రతుకనేర్చి
నను శుభంబులొదవు । సరసతగల్గిన జగమెల్ల వశమౌను యుద్యోగ
పరుడైన నొదవుధనము । చతురుఁడగువాడు యెప్పుడు జగములో
న । చంచలించకమెలగిన సకలసిద్ధి ॥ కలిత॥ *

(౧౮.) సీ॥ నడుమంత్రపుజూడ నరులసుకర్మముల్ నేటిదాజగము వర్ణించి
చూడ । యెన్నగవశములా యేండ్లెవ్వరికినైన నయుడుగునాజన్మంబు
లొల్లమనిన । సాలిడిపోగులా సంసార పాశముల్ యల్పమా బ్ర
హ్మాండమరసిచూడ । నీటిపైవ్రాతలా నీరజాసనువ్రాత యెఱిగిరా
తత్వజ్ఞులింతలోన । యెంతవారికి తెలియంగ నెట్లువచ్చు । నీప్రభా
వంబులన్నియు నీకుగాక॥ కలిత॥ *

(౧౯.) సీ॥ మాంధాతకొనిపోడు మహిచేరదైనను కొనిపోడురారాజు కొ
లువుకొంత । నలుడుదాగొనిపోడు నవరత్నమొకటైన శిబికొనిపో
డొకచిన్నమైన । కొనిపోడు ఖచరుండు గోవునొక్కటి నైన వ
స్త్రంబుగొనిపోవ డాయయాతి । గుఱ్ఱమొక్కటినైన గొనిపోడు న
హుషుండు గజముగొంపోడు నొక్కటినిసగరు । డింక నెవరికి సత
మౌను యెల్లసిరులు । దానొనర్చినధర్మంబె దగిలివచ్చు॥ కలిత॥ *

(౨౦) సీ॥ సుఖదుఃఖములనుబ్బు గ్రుంకులెరుగక వనధికైవడినుండు వాఁడెయోగి.। పంచేంద్రియముల పాల్పడి చరియించక గగనంబువలెనుండు ఘనుఁడెయోగి। యజ్ఞానరహితుఁడైయంధకారముబాసి యాదిత్యువలెనుండు నతఁడెయోగి। పరిపూర్ణుఁడైయుండి భావింప చోద్యమై పవనునివలెనుండు బలుఁడెయోగి। బహువిధంబులమీ పాదభక్తిగలిగి। చదువుకుండినవాఁతఁడెపో సిద్ధయోగి॥ కలిత॥ ❋

(౨౧.) సీ॥ అత్యాశకలవాని కబ్బనీయదుసిరి గుణములన్నియుబాపు క్రోధబుద్ధి। పిసినగుణంబది పిమ్మటతిట్టించు కడునహంకారంబు కష్టపరచు। మదిమియెవ్వరికిని ముందుతోచగనీదు బాల్యంబుమందత ప్రబలజేయు। ధనకాంక్షమిక్కిలి దయధర్మమెడలించు చలముకార్యవిచారసరవిచెరుచు। ఘనులుతలపోసి యీవట్టిగతులుమాని। ప్రబలుదురువారు సన్మార్గపదవిదెలిసి॥ కలిత॥ ❋

(౨౨.) సీ॥ తగిలితాఁజేసిన ధర్మంబుతనుగాచు దైవంబుగొల్చిన తన్నుబ్రోచు। జితకాముసితపంబు శీఘ్రమెఫలియించు సత్యమెక్కడనైన జయముబాపు। ప్రియవాక్యమందరి బెనచిచుట్టముజేయు మంచితన్ను పొగడించు మంచితనము। కడిగండమడగించు కలితాన్నదానంబు జపముపాతకముల జకియజేయు। యెరిగి నడిచినసిద్ధించు నిహపరంబు। సులభమన్నిట నినుగొల్చు సుజనులకును॥ కలిత॥ ❋

(౨౩.) సీ॥ బహుపుణ్యుఁడగువాని బ్రతుకుదినంబిది మనసునిల్పినవాని మహిమమేలు। జ్ఞానంబుగలవాని జన్మంబుసఫలంబు తప్పుజెప్పినవానితగవులెస్స। సమబుద్ధిగలవాని చరితంబుసమ్మతియుపమరియగువానియునికిబాగు। వావిగల్గినవాని వర్తనసుఖమిచ్చు మేలెరింగినవాని మెచ్చుమెచ్చు। భువిని యిటువంటి మనుజుండెభూషణంబు। కలుగునీకృపనీరీతి ఘనులకెపుడు॥ కలిత॥

(౨౪.) సీ॥ చాడిగాడగువాడు సటలెల్ల బోధించు నందులకొరిపై నలుగ
వలదు। పాతకియగువాడు పరులదూషించును వెఱ్ఱియై తానది విన
గవలదు। వెడదొంగయగువాడు విత్తంబులీవచ్చు భ్రమసియాసల
నది బట్టవలదు। మాయావియగువాడు మందుమంత్రము నేర్పు మ
రచితప్పియునది మరగవలదు। కర్తయగువాడు కపటుల గతులు
దెలిసి। యేమరక రాజ్య మెప్పుడు నేలవలయు॥ కలిత॥ *

(౨౫.) సీ॥ హోపరిమెంతైన హోవవేసారదు సారదియాదాయమె చూ
చుగాక। మహాగ్రహస్తుండ లమటలకువోడదు సాలయుకే పనితై
న చొచ్చుగాని। కాల్రాడినవాడు సుఖంబులుకోరదు పరులచే నిందను
పడునుగాని। యలమట దెప్పుడు యప్పులకోడదు సుసరాన దిద్దక
జూలుగుగాని। కణగిపిరలకీవోజ కర్మవశము। కర్మఘులుఖిమ్ము పి
ల్చినగాని తెగవు॥ కలిత॥

(౨౬.) సీ॥ ఒకడు దాచినయర్థ మొక్కడు భుజియించు నొకసతి మగడువే
రొకతెకగును। కాయంబు నిలువదు కడు బ్రహ్మకైనను చాయకో న్నా
ళ్లదిజవ్వనంబు। చదివినచదువులు సరిశరీరముతోనె తలపులు మరచి
నందాకయుండు। కులము దారిద్రంబు కొంచంబుగాజేయు। వలపు
వేసటమైన వదలివిడుదు। యేల భ్రమయంగ నెవ్వరి కేది నిజము।
చెలగిమిముగొల్చు వారికి చెడనిపదవి॥ కలిత॥ *

(౨౭.) సీ॥ శత్రుల మాటలు సతమనినమ్మక కాంతలకుచ గుట్టు గానసీక।
సమయగాండ్లకు మతిదనువు చెల్లించక తోడుబోతులనిండ్లు దొక్క
నీక। ఘనతర ద్రోహిని కడగిచారకనీక మొదటవంచకునకు మోస
బోక। పిరికిపోట్లాటకు పెనపెట్టుకొనిపోక దొరయానిహీనుని తోడు
గనక। బెదరకెచ్చరికై యుండు వాడె రాజు। జగతి వర్ధిల్లునట్టి వి
చారపరుడు॥ కలిత॥

(౨౮.) సీ॥ మానంబెక్కుడు పరిప్రాణములకంటె తనకీర్తియెక్కుడు ధనముకంటె । సాహసంబెక్కుడు సాముచేయుటకంటె పంతమెక్కుడు ప్రతాపంబుకంటె । యిలలోన దారిద్రమెక్కుడుశిరికంటె జీవమెక్కుడు తనబిరుదుకంటె । సమరమెక్కుడుమరి సంధి చేయుటకంటె ధైర్యమెక్కుడుదొర తనముకంటె । వెలయు నిటువంటి గుణముల వీరవరుడు।కలడువెయ్యింటనొక్కడుకలడొలేడొ॥కలిత॥

(౨౯.) సీ॥ నయకోవిదులుతప్ప నడచికేనియువారి వరుసగాదదికర్మ వశముగాని । ధనికులుభోగించ దనియజాలమివారి జడతగా దదిజన్మ సరణిగాని । పుణ్యంబుపాపంబు పొంతబోయినవారి గతులుగాదది దైవ గతులుగాని । సుగుణులులోక నిమ్నులైన నవివారిజాడగాదు త్పాతసరణిగాని । యెరిగినడవంగ వారలయిచ్ఛగాదు । ధర్మదేవత మెలగు చందంబుగాని॥ కలిత॥ *

(౩౦.) సీ॥ చెలుల సందడినున్న చిత్తంబు చెలిమించు కనకంబు పొడగన్న గలుగునాస । మరియచేబట్టిన శూరత్వములురేగు నీచవర్తనుపొందు నిందగొల్పు । మేలికతోమేల మెప్పుడు విషమించు పదుదుతోన వ్వినభంగపరుచు । సభలోననవ్విన సడియెల్లపైకొను విటులగూడిన వివేకమ్ములెడలు । యెరిగియన్నియువజించి యేకతమున । నిన్నుగొల్చిన వాడెపో నిపుణుడరయ॥ కలిత॥ *

(౩౧.) సీ॥ కొన్నిభూములయండ కొన్నిభూములవాన యొక్కని మేలువేరొకనికీడు । వెలయుచుక్కలు రేయు వేగుపొద్దునమాయు కొంతకాలముకల్మి కొంతలేమి । కప్పుమేఘముమింట కడపట బయలౌను జవ్వనంబదిపోను జడిశిముదియు । కాయమైయున్నది కడపటపండ్లౌను కడుహీను లధికులై కానబడును । ఎంచి జూచిన వెనకముందెవరికయిన । కలగవలయదు సహజంబు [illegible]గతులు॥కలిత॥ *

(3౨.) సీ॥ భుజియించినప్పుడె పోవునాహారంబు పూశిగంధంబు పొట్లు
రాలు। కట్టినప్పుడెమాయు ఘనవస్త్రచయములు ముడిచినప్పుడె
వాడి ముణుగువిరులు। కలశినప్పుడెవీడు కాంతలతోతమి తొడిగిన
వేగుత్తై తోచుసొమ్ము। యెక్కినప్పుడెవాహ నములలయించును
వశముగానిక్షనంబు వట్టితొడుసు। కలుగనేర్చనెనిత్య సౌఖ్యంబు
లెందు। నిన్నుగొలిచినసుఖములు నెగడుగాః॥ కలిత॥ *

(33) సీ॥ తనకాప్త్రలగువారి దండనుండగతగు అధీశూరులనుదండ ను
పతగును। మహిధనాఢ్యులకును మణియమియ్యగదగు హితులవా
కిలికావ లిడగతగును। సముచితజ్ఞులరాయ సమురాయ నిడదగు
మాయావులతలార్ల జేయదగును।ఘనకార్యపరుల దుర్గములబెట్టగ
దగునిర్గుణుల దిశలను నిలుపదగును। మరచియల్పుల తానమ్మ మ
నుపదగదు। గరిమెధరయెల్ల నేలెడు ఘనులకెరుడు॥కలిత॥ *

(3౪.) సీ॥ సరసులు పంతముల్ సభలోననాడరు వీడరురణములో వీరవరు
లు। కలగరేపట్టున ఘనశవివేకులు మరచితప్పరునీతి యుతులుపను
లు। తలచరుపాపముల్ ధన్యులుకలనైన నలయరాచారంబు నందు
బుధులు। నిందించరెవ్వరు నిపుణులుద్వాత్రమచ్చి తలచరుపరుల కాం
తలను ధన్యు। వదలరెప్పుడు తమయిలు వరుస గుణము। వసుధవీ
రలు మీప్రతాపంబువలన॥ కలిత॥ *

(3౫.) సీ॥ పేలెన్నిబుట్టిన పెద్దగా బెరుగవు చీమలతోడ నశించిపోవు।
చదలుపుట్టలుబెట్టి శీఘ్రమెయణగును మిడుతలువే మై మించిమడి
యు। యీగలువడిమాగి యీడేర కెంతయు నల్లులు జనిగుంచి
నవిశిటోవు। దోమ ఉద్భవమైన తోడనె బొలియును కీణుదురుల్
తుట్టులు గట్టినమయు। పరగనీగతి దుర్జనుల్ ప్రబలమైన। పరులపీ
డించిచెడుదురు పాపమతులు॥ కలిత॥ *

(౩౬.) సీ॥ మలశి చే సేటట కూనలు బెట్టు పిల్లులుకంటిమా మరిపిల్లి కడుపు
నొకటి। పాము గ్రుడ్డులు బెట్టు పదినిరువదియును బ్రతికె నా భూమి
పై పౌజులగును। పులులు పిల్లలనీను పొందుగా నాల్గైదు యున్నదా
మందలై యుర్వీలోన। కమఠంబులెన్నైన మనుజులలో బుట్టు నెగ
డె నాగుంపులై నేలమీద। క్రూరసంతతి వెలయునె కొంచపడక।
విరివిగా ధర్మసంతతి వెలయుగాక॥ కలిత॥ *

(౩౭.) సీ॥ అధముని మొరనైన యాలకింపుట యొప్పు వినకున్న రాజాజ్ఞ వి
పులమౌను। పెట్టిచూచిన యొప్పు మితిలేని రాజ్యంబు పోకున్న నలజ
డిపొందుచుండు। తనసొమ్ము పల్మరు తలచిగ కగొనుటొప్పు కా
కున్న తెలియదు కఱిమిబల్మి। కలయుటొప్పును కుల కాంతలతో తమి
మానిన పాపంబు మహిని గల్గు। మత్తుడైయున్న కార్యంబు మట్టుప
డును। వలశి వల్లమి కౌయంగ వలదు పతికి॥ కలిత॥ *

(౩౮.) సీ॥ పతిచేయు కార్యంబు భటుల చేకూడదు భటుల కృత్యంబు భూ
పతికి తగదు। మగని స్వతంత్రంబు మగువకు చెల్లదు మెలత విధంబు
పెన్మిటికి తగదు। మంత్రియున్నాడను సామాన్యుడుండగరాదు సా
మాన్యగతినుండ తగదు మంత్రి। కరణంబు తోపగ కాపువానికి గాదు
కాపు తోపగ గాదు కరణమునకు। యధికకృత్యంబు లల్పులకరయవ
లదు। యల్పకృత్యంబు లధికులకెపుడు వలదు॥ కలిత॥ *

(౩౯.) సీ॥ పదుగురాడిన మాట పాటియై ధరజెల్లు యొకడాడిన మాట
యొక్కడెందు। యూరకండినవారి కూరెల్లనోపరు నిజముముం
దరికెల్ల నిలువ డెపుడు। చేసినదంతడా చంగపుట్టక పోదు దేవతల
కునైన దీరదాన। రాజు చేసిన కీర్తి రంజిల్లు ధరలోన కపటాత్ము
తో పొందు కడగండు। పుడమిలోకులు మెచ్చంగ నడువవలయు।
చలము సాధింప జెల్లదు సభలలోన॥ కలిత॥ *

(౮౦.) సీ॥ నిర్మలునొకధూర్తు నిందించిననునేమి త్రోవలకున్యూనతోంట్ర
పురుగు । అధముండుసత్కవి నండనుండిననేమి తొరలదే విరుల
తో తుంగపాచ । కడగియుల్పుడు ఘనుగారించు గాకేమి కరువదె
యొకదోమ గంధగజము । దొరతోడనీచుండు తొడరజూచి ననే
మి ప్రాకదె బలుమేడ బల్లిపిల్ల । యీడుకానున్నపనులవి యెంచ
నేల।అందులకునేమి తారతమ్యములుగలవె॥కలిత॥ *

(౮౧.) సీ॥ పరువంబుమీరిన బహుపుష్పజాతులు పదనుతప్పినయట్టి పరిమ
ళములు । నలువది యేండ్లపై నరశినవనితలు శాంతచల్లారిన భోజ
నములు । మిగులనెక్కుడుగాలు మీదటివస్త్రంబు వెలయుతోంబది
యేండ్ల వృద్ధగజము । పాతపంజరానైపఱగెడుగుఱ్ఱంబు సంగా
తమెడలిన వీడెములును । ఘనులకివియెల్ల భోగయోగ్యములు గా
వు।వరుసనెంచిన పరిపాటివారికగును॥ కలిత॥ *

(౮౨.) సీ॥ చరయుకొల్లయులూటిశీమలోలేకుండ దండెత్తవలయు శాత్రవు
లిమీద । గడ్డియుగవసంబు కడునీరుగలుగుచో యరసిపొందుగ విడి
యంగవలయు । గైకొన్నభూములగాపుగాతాణంబు లొనరించి
యావల నొత్తవలయు । గజముగుఱ్ఱములు బటు గాశిబొందకయుండ
లలిబోరి పగరగెల్వంగవలయు । బుద్ధిచదరక యెప్పుడు భూవి
భుండు । మెల్లనేబహుసౌఖ్యంబు మెరయవలయు॥ కలిత॥ *

(౮౩.) సీ॥ దుష్టుండు సూర్యునిపై దుమ్మెత్తిచల్లిన తనపైనబడుగాక దాని
కేమి । వలబడ్డమీనెంత వడిగాగబొరలిన తనుచుట్టుకొనుగాక దా
నికేమి । కొండతోతగరుఢీకొని తాకినానేమి తలవక్కలగు గాక
దానికేమి । మిడుతలుచిచ్చుపై వడినెంతగవశిన తానెశొక్కుడు
గాక దానికేమి । యెదురు సత్వముతన సత్వమెరుగలేక । పోరు
వాడెందునవివేకబుద్ధియంద్రు॥ కలిత॥

(౪౪.) సీ॥ చెలగిపుణ్యాసిజేరి చిరకాలమునబ్రతుకు క్రూరుడైబల్మిచే గొ
న్నపెడ్లి । కల్లలుపచరించి గడియించినధనంబు దూరులుబడునట్టి
దొరతనంబు । కపట బుద్ధికిజొచ్చి గైకొన్న రాజ్యంబు దయలేక
యుండినతపసితనము । యాసతోగైకొన్న యట్టిసన్యాసంబు కప
టాత్ముడౌయధికారవృత్తి । మనుపదెంత్తైన దైవంబుమరలిమరలి।
తొలగనియ్యదు దుర్గతిద్రోచుగాక॥ కలిత॥ *

(౪౫.) సీ॥ ఎంమిపతివ్రత నెవ్వడుగోరిన చదలంటునేనిప్పు శిఖలోన । ఘన
జితేంద్రియునినే కాంతడగ్గినను కలగునెజలరాశి కప్పచేత । ధ
ర్మవర్తనునిపాతకు లేచరించిన చేరు నిద్రించునే యెందునైన। ధీ
రాత్మునితరులు తెమలించగానేమి గాలియవ్వరిచాత గట్ట బడునె।
యెందులను ధార్మికులకు కీడేలగల్గు । నిజగుణంబులు సహజమై
నిలుచుగాక॥ కలిత॥ *

(౪౬.) సీ॥ పుచ్చకాయలుదిన్న బోయెడుమత్రంబు యిచ్చునెఫలములెవ్వరికి
నైన । కడపదాటగలేని బడుగైనగుఱ్ఱంబు యెక్కునె పౌజుపై
నెందునైన । యాకలియుడుపని యట్టియాహారంబు బలియిందునే
మేను బటువుగాను । తనవిజానది దాటనిదేవత యొసగునె మో
క్షంబు లెవరికైన । ధరణినిన్నింటి సామర్థ్యమరశిచూచి । బలువుగ
లదెల్ల చేబట్టి తెలియ వలయు॥ కలిత॥ *

(౪౭.) సీ॥ జిలుగురేగినమాను చావకంభముగాదు గొడ్డుపెంచినపాడిగో
వుగాదు । ధరపంచిశంబెంత తరచినవెయిగాదు యెండమావులు
నీళ్ళు యెపుడుగాదు । పరగనుల్కలు వెయిబడి మాకను గాదు
కూరయెంత్తైనను కూడుగాదు । యెనుబోతుబలశిన యేనుగసరి
రాదు కడునశుద్ధపువాగు గంగగాదు । తొండంబుగల్గిన దోమ
యేనుగగాదు కోడికోకిలగాదు కూతలిడిన । ప్రబలిచూపట్టు నవి
యెల్ల పనికిరావు । ధీరుడగువాడు యొక్కడెవీరవరుడు॥కలిత॥ *

(౪౮.) సీ॥ గోడపైనున్నంబు గోకినపనిగాదు వాళ్ళిపైవాసన పూర్చగాదు। చేతబట్టినయట్టి జిడ్డుతెక్కకురాదు కోకపట్టినగంజి కూర్చరాదు। విసనకఱ్ఱలవన్నె విడిపించనిల్వదు బచ్చనగచ్చు చొప్పడగరాదు। మగ్గుబెట్టినపిండి మొనశియట్లకురాదు మీసాలపైతేనె మింగరాదు। చూడచేబట్టినవెల్ల మాపులగును; నీవుచేసిన మహిమలునిఖిలమెల్ల॥ కలిత॥ ❋

(౪౯.) సీ॥ కనకంబు పెంచాకగతిగానెభావించు కామంబు క్రోధంబు గట్టిపెట్టు। తిట్టినతిట్లెల్ల దీవెనగావిను యలశత్రుమిత్రులుగా నాత్మదలచు। యటభూమికనక పర్యంకంబుగాబండు భిక్షాన్నతృప్తిపై పెంపుగలిగి। కాషాయవస్త్రంబు కౌపీనమునుగట్టి నిరతిబ్రహ్మధ్యానని యతుడగుచు। యేకతమ్మునమౌనియై యిలచరించు। నతడుసన్యాసి యనియెంచ నర్హుడగును॥ కలిత॥ ❋

(౫౦.) సీ॥ బలుమాలవాడలో బ్రాహ్మణిల్లుండునె నిర్దయునకునేల నిలుచుకరుణ। కప్పకాటెందైన కలదనివిందురా పిరికివానికినేలబిరుదుగల్లు। బొగ్గులతైలంబు బుట్టంగనేర్చునే యీమీద మొండికెగ్గేలకల్లు। కెరలింపరాతికి గిలిగింతగల్గునె కఠినచిత్తంబేల కరగనేర్చు। కలరుయిటువంటిజగతినికొందజనులు। సరవిదప్పించవచ్చునె జన్మఫలము॥ కలి॥

(౫౧.) సీ॥ మచ్చరించినవాడు మంచిమాటాడిన వేగమెలోచును వెగటుతనము। యపనమ్మికయినవా డటువిందులిచ్చిన మందులందురుగానిమనసుగొనవు। వెడబాటుగానివా డూరకెమొక్కిన సందేహపడుగాని సహజమెంచ। డనుమానమైనవా డర్థంబులిచ్చిన నళుకుగానెంచువిశ్వాసపడడు। యేమిచేసినకపటికి హితవుగాను। దూరుమలశిపనులెల్ల మట్టుపడును॥ కలిత॥ ❋

(౫౨.) సీ॥ కామినీరతులులోకమువారు నమ్మరుపతితుల విడుతురు బంధు
జనులు । గుణహీనులైన లోకమువారు మెచ్చరు వేడబో రర్థులువి
గతయశుల । హింసాపరులతోడ నెనయరు సాధులు పురుషార్థ
ములపొంత పోరుబుధులు । విద్యావిహీనుల విద్వాంసులాలయరు
నృపులుచేపట్టరు చపలమతుల । యుర్విమీదటనుత్తము లొక్కరా
శి । యధములొకరాశియునుగాదె యరసిచూడ॥ కలిత॥ *

(౫౩.) సీ॥ అపరాధియగువాని నటచంపవలవదు తానాడుకల్లలె తన్ను
జెరుచు । సర్వకంటకునెందు సాధింపవలవదు వసుధవారలగోడు
వానిచెరుచు । యతిమూర్ఖుడగువాని నదలింపవలవదు తనలోని
కోపమెతన్నుజెరుచు । కడునహంకారుని గాదనవలవదు మేనిగ
ర్వంబులెమిగుల జెరుచు । చెప్పవలవదుబుద్ధులు జెప్పవలదు। సత్య
విధులకు ధర్మమే జయముగాన॥ కలిత॥ *

(౫౪.) సీ॥ కోరిదవ్వులజూడ కొండలునున్నచేరి దగ్గరిననుచెట్లురాళ్ళు। బూ
రుగఫలములు బుట్టించునాసల నెక్కికోశినపండ్ల నెగయుదూది।ని
ణుగురుపురుగులు మెఱుగులైయుండును కలగితూచినను బంగారు
గాదు । కాకిచిప్పలువెండి కరణిగాన్పించును పుటములువేసిన బూ
డిదగును । మొదటివారలసంపద లెంతలైన। యడుగబోయిన ఫలి
యింపదవనిలోన॥ కలిత॥ *

(౫౫.) సీ॥ అపవిత్రమగునట్టి యన్నంబు గొనుకంటె యడవిలో దినుబలు
సాకులేలు । హితశత్రువై యలయించు శత్రువుకంటె కయి వశం
బగుశునకంబులేలు । బహుదుర్గతులగూర్చు పరధనంబుల కంటె
న్యాయార్జితంబునే మాత్రజాలు । నపకీర్తిభోగ సుఖంబునకం
టెను చిత్తంబులోయాత్మ చింతలెస్స। సజ్జనులునేతుర రిటువంటి
జాడలెస్స । తకిలనవియెల్లరుచులౌను తామసులకు॥ కలిత॥ *

(౫౬.) సీ॥ ఇచ్చకంబాడిన హితవగుపతికిని మతిసందడించిన మనసు విఱుగు। నొాదిగివర్తించిన నొాడబడిదయవచ్చు పంతంబుమెఱసిన పగలు తెచ్చు। నేర్పుతోగొల్చిన నెలమినర్థము తెచ్చు యాడుగఁబోయిన వేసటగును పతికి। తలపులోమెలగిన వెలయుసంతోషంబు యారమరకైయున్న తరుగుభక్తి। మంత్రియగువాఁడు కార్యాకర్మంబులిట్లు। తెలిశినడచిన శుభములు తేటపడును॥ కలిత॥ ❋

(౫౭.) సీ॥ అడుసుచేతుల దియ్యవచ్చు వాకొక్కవేళ బలశియుండిన గడ్డపారవలయు।యాకటివేళనే యన్నంబుచవియగు తనిశితెనొకలింతలుగడంగు। తరితోడవిత్తిన తరుదుగాబండుఁయీపొద్దువిత్తిన యీచబోవు। బంటునాయావేళ బనిగొనగాదగు యలవాటుదప్పినయడచిపడును। వేళవేళలకార్యంబు వెలయజేయ। వలయునొకయింతదప్పినవలముకాదు॥ కలిత॥ ❋

(౫౮.) సీ॥ యడవిలోపలరాజ్య మాదియొుల్లమనరాదు బలియుడునైకొన్న బాధశేయు। క్రూరవర్తనులను గూర్చిరేఁటతగు పగరగూడినవాడు భయమొనర్చు। గడినున్నవారితో దొడరుట రొుప్పను వూరకుండిన నతండొత్తజూడు। పలుమాఱుతనబంటు పౌజు జూచిన మెుప్పు గర్వింతురటువలె గాకయున్న। నృపతికేమరియుండుట నీతిగాదు। బహువిధంబులనేర్పుమై బ్రబలవలయు॥ కలిత॥ ❋

(౫౯.) సీ॥ దానపాత్రులకిచ్చు ద్రవ్యంబుఫలియించు విటులకొసంగిన విఫలమగును। మంత్రపుఅగ్నిహొాత్రముతప్ప రక్షించు బూడిదలోవ్రేల్యబుణ్యమిందు। కాలోచితంబైన కర్మమీడేరించు వేళదప్పిన సంధ్యవిధికివెలితి। యొుకులకునుపకార మొునరించశుభమిచ్చువడికీడు జేసిన నరకమొుదవు। యెపుడు జేసినధర్మంబు యెపుడుమనుచు। యెరుగక మాలినకృత్యంబు లేమిభాగింతి॥ కలిత॥ ❋

(౬౦.) సీ॥ హీతబుద్ధియడుగుచు హీతుండుగల్గిన మతితోడ బోధించు మంత్రిగల్గి । వెంపేమియునులేని వీరుండుగల్గిన తగుపరివారంబు తానెగల్గి । పొందుసేయగనేర్చు పురుషుండుగల్గిన ఘనుడైన చెలికాడు గల్గియుండు । ఘనతరస్థితి నెరింగినవాడు గల్గినకడుమెచ్చ జెప్పెడుకవియుగలడు । వేసరకమంచివారల వెదుకవలయు । తలచి జూచినయవియెల్ల దైవఘటన॥ కలిత॥ ❋

(౬౧.) సీ॥ తొల్లి జెట్టినమేలు తోడరియిప్పుడు రాదు కావలశినపని కాకపోదు । చేసినకర్మంబు జెందకమానదు రాగలయర్థంబు రాకపోదు। దైవసంకల్పంబు తప్పదెందైనను తనువికారంబులు తగులునెపుడు। లోకధర్మమునకు లొంగకమానదు తగినభోగంబులు తానెగల్గు। వేగరించగవలవదు విమలమతికి । సకలమున కోర్చియుండిన సకల మొదవు॥ కలిత॥ ❋

(౬౨.) సీ॥ నికరంబు వలెనుండు నెపుడు సంసారంబు మెరశిన యట్లుండు మించిసిరులు । కాయంబుదక్కిన గతినుండు తలపోయ తనదియైనట్లుండుతనదు గృహము । సతములైనట్లుండు సరసాన్న పానంబు పాయనియట్లుండు బాంధవంబు। యమరినయట్లుండు నటపుత్రపౌత్రులు చేచిక్కినట్లుండు చిత్తమొదవు।యింద్రజాలంబుస్వప్నమో యిదియునొక్క । సిద్ధవిద్యయొతవిలియీచేత లెల్ల॥ కలిత॥ ❋

(౬౩.) సీ॥ కల్ప వృక్షంబెంచి కలివిచెట్టెంచుట తగవెరుంగనివారి తగవుగాక । కావేరినదియెంచి కాలువలెంచుట పురుషుల యవివేకబుద్ధిగాక । కౌస్తుభమణియెంచి గాజుపూసెంచుట జనుల యజ్ఞానంబు సరళిగాక । మంధరాచలమెంచి మఱితిప్పలెంచుట మతి చలించిన వారి మతియుగాక । ఘనులనల్పుల నీరీతికలయగూర్చి । పలుకుచుండెడువారల భ్రాంతికాక॥ కలిత॥

(౬౪.) సీ॥ సాంప్రదాయుండై శాస్త్రప్రవీణుండై యాగమజ్ఞుండైన యతఁడె గురుఁడు । కడుతపోనిష్ఠుడై ఘనమంత్రసిద్ధుడై యధ్యాత్మ వేత్తయౌ నతఁడెగురుఁడు। పరమదయాళుఁడై పాపనిర్ముక్తుడై యాచారవంతుఁడౌ నతఁడుగురుఁడు। ధారిసుజ్ఞానియై బోధింపశక్తుడై యతిశాంతచిత్తుఁడౌ నతఁడె గురుఁడు । తలఁచియిటువంటి గురుఁజేరి వెలయవలయు । సుజనులగువారు యీడేరఁజూచిరేని॥ కలిత॥ *

(౬౫.) సీ॥ శౌర్యంబుగల్గుట జన్మసాఫల్యంబు శాంతయుాత్మవివేక సాధనంబు । మానంబుదనకును మహనీయసంపద సిగ్గుతోఁబ్రతుకు సజ్జీవనంబు । సవినయవచనంబు సర్వవశ్యకరంబు వెలయు నాచారంబు వెన్నుబలము । దానంబుసేయుట తనకదిదాచుట సజ్జనసంగతి సౌఖ్యమొసగు । గానబుధులీగుణంబులు మానకెపుడు । శ్లాఘిలిమిమ్ముభజింతురు దలఁచిదలఁచి॥ కలిత॥ *

(౬౬.) సీ॥ తినతినజిహ్వకు తీపైన చెఱకుగాబోఁ సారెకుబలుకుట చప్పదనము । కాంతలుపైకైన కడువేసటయు దోఁచు నెంతసంపదగల్గ నంతెచింత । కడువెడఁజొచ్చిన కణగులాఘవమెల్ల బాసలుతప్పిన పాడిచెడును । ఇంటింటికేగిన నెడయుపెద్దరికంబు తనవాసివిడిచినతరుగువన్నె । మట్టుమీరకలోకసమ్మతముగాను । గుట్టుతోడుతఁబ్రతికిన కోటిసేయు॥ కలిత॥ *

(౬౭.) సీ॥ పరకాంతకైసింహబలుఁడుమృతుండయ్యె రాజ్యలోభమునకౌరవుఁడుమడిసె । పౌరుషోక్తులశిశుపాలుఁడుహతుఁడయ్యె మహిఁజూదమున ధర్మజుఁడు నొగిలె। యలపాండురాజు వేటాడిశాపమునొందెమునురావణుఁడు చలముననుమడసె । క్రూరదండంబున కూలెను వేనుండు జడిసెపానమున రాక్షసగురుండు । ఘనవివేకులు వీరలగతులుదెలిసి । వ్యసనములుమాని నడువంగవలయునిలను॥ కలిత॥ *

(౬౮.) సీ॥ ఇలఁదొమ్మరిడిజాతి హీనతలెంచదు పూటకూళ్లదివర్ణ్యమునకు
జేరదు । జారకామినితన బావుచింతించదు మొనసిలజ్జయు మెంగ
మాటపడదు । విరహిణిమదిలోన వెతఁబొపాటించదు చెలగిదూతిక
కడు సిగ్గుపడదు । పరగృహవాసిని పరనిందకోడదు బడిసంత బనిది
మెవ్వరిదిగందు । ధర్మవిదులిట్టి వారలదగులకెవుడు । వెలయసన్మా
ర్గవర్తులై మెలగవలయు॥ కలిత॥ *

(౬౯.) సీ॥ తోడసల్గినకవి కానిపద్యముజెప్పకడు ముచ్చుదోడరిన కన్నబెట్టు।
ధనికుతోబోరిన తనువెట్టిగాగోను పశుకొమ్మునోంసిన పదరిపోడు
చు । భట్టుతోగినిసిన పలుగౌలంగులదిట్టు మూఖుడానిజెనకిన మురి
యగొట్టు । చేరియమాత్యుమించిన భంగమతరిందు మంత్రజ్ఞు దొడ
రిన మంత్రమొదవ్వ[illegible]ట్లుగావున యసమానమైనవైర। మెట్టివానికిత
గవుగాడెంచిచూడ॥ కలిత॥ *

(౭౦.) సీ॥ ప్రాయంబుగలనాడె పంతంబులీడేరు బలిమిగల్గిననాడె బరగు
జయము । సంపదగలనాడె సరవిసౌఖ్యముగలు తగవుగల్గిననాడె
ధర్మమొసగు । పిలుపుగల్గిననాడె ప్రియమెల్లసిద్ధించు పోడిమిగల
నాడె పొసగుమాట । మన్ననగలనాడె మనవిచేకూడును చనువుగ
ల్గిననాడె సరసమమరు । మోసపోయినమతిరాదు మొదటిచంద।
మెఱిగి నడిచినవాడెపో యెంకుబడంద్రు॥ కలిత॥ *

(౭౧.) సీ॥ ధరణిదారిద్ర్యంబు దైన్యంబునొందించు బహుభీతికార్పణ్యమడ
రజేయు । శంకయూరకమైన సరితోడువెదకించు బహులంపటత్వ
ముల్ భంగపరచు । తనసిగ్గుతనుదానె తలవంచుకొనజేయు చేసి
ననేరముల్ చింతగులుకు । వడిసీచకృత్యంబు యవమాన మొనరిం
చు చెందివృద్ధత్వంబు శిథిలపరచు । తనువికారంబులెప్పుడు తగులు
గాక । తొలగనియ్యకదుర్గతి దోచునెప్పుడు॥ కలిత॥

(౨౨.) సీ॥ సంసారికనుసరించకదీర దక్షిణలనంగనాస హితునకడగరాదు। పుత్రవంతునకును బోదుయాచింపక భువిగ్రహస్థునకాడి బొంకరాదు। బంధుపోషకునకు భారమానకపోదు దేహధారికికాంక్షదీర్ప రాదు। శూద్రునకేమైన కూరుబెట్టకపోదు క్షేత్రవంతునకప్పు కాయరాదు। నరునికిక వైరాగ్యంబు నడచుటెట్లు। రమణతోమిమ్ము గొల్చువారలకుగాక॥ కలిత॥

(౨౩.) సీ॥ సుముఖుడౌటకునవ్వు చూపులెమెక్కుడుయింపొంద మెచ్చుటకీవిగు రుతుకూడి। యుండుటకోర్చుకొనుటయే సూచనము మన్నించుటకును మంచిమాటయెరుక। వెసనమ్ముటకుచాడి వినకయుండుటె చన్వు చేపట్టుటకుబోరశీన జెసన్న। దయదలంచుటకును తప్పుమానుటె సాక్షి లిలినేలుటకునీటు లక్షణంబు। స్వామియగువాడు భటునకు చనువు లొసగి। మనుపదచినయట్టి సన్మానికులకు॥ కలిత॥ *

(౨౪.) సీ॥ చెఱుపరానిమనుష్యు చెల్లదుకోపింప వైరిచేజిక్కినవదలజనదు। విశ్వాసియగువాని విడుచుటయవినీతి ద్రవ్యాపహారుని తగదుమను ప। పాపాత్ముడగునట్టి బంటునేలగరాదు ధర్మాత్ములయింపతక్కవుగాదు। బుద్ధిజెప్పనివాని బోలదుభజియింప నపరాధిహితు పై నలుగరాదు। వరుసనారసియధిపులువారివారి। గుణములెఱుగుచు కార్యంబు గొనగవలయు॥ కలిత॥ *

(౨౫.) సీ॥ కోపంబు నణచిన గురుతరాధ్వరఫలం బింద్రియజయము మాహేంద్రపదవి। చలమువారించుట సామ్రాజ్యవిభవంబు చంచలం బుడుగుట సకలసిద్ధి। వెసనహంకారంబు విడుచుటభాగ్యంబు దైన్యవర్తనమేయ ధర్మగుణము। నిందవాసినయుక్కి నిరుపమలాభంబు బుణవిముక్తుండౌట హృదయసౌఖ్య। మింతకంటెను మేలులేదెంచి చూడ। మహినినియతజ్ఞులగునట్టి మానవులకు॥ కలిత॥ *

(౭౬.) సీ॥ కామాతురత్వంబు కడుసిగ్గుపడనీదు భూతంబుసోకిన బుద్ధిచెడు
ను। యాకటనలశిన నతనికెక్కడిలావు రోగంబుబలశిన రుచులు దొ
లగు। కలిగిశోకపువేళ గలుగదుహాస్యంబు యాచకునకుగల్గదెందు
సౌఖ్య। మూఁడుబిడ్డలుగన్న యప్రుడెపంతమువీడు వుత్సాహమెడలి
న నడుగుబల్మి। యెందులకునౌను సంసారియేమిజేయు। కలుగు
నవియనుతొల్లింటి ఫలముగాక॥ కలిత॥ *

(౭౭.) సీ॥ గరిమనేలికలేని కయ్యాకేడకునెక్క రాజాజ్ఞలేని రాజ్యంబుచె
డును। బహుధనంబులులేని బలముదేపనికొచ్చు బలములేని ధనం
బుబాతిగాదు। ధర్మంబులేనియా స్థానమంతయు వృధా సామునే
రనిపోటు సరవిగాదు। సవరణలేని విశాలదుర్గంబేలగట్టి తాణను
లేని గడినశించు। లంకెనొకటికి నొకటి యీలాగుదెలిశి। వరుసద
ప్పకధరయేలువాడెరాజు॥ కలిత॥ *

(౭౮.) సీ॥ సమమైనశత్రుతో సంధిసేయుటకార్య మెక్కుడైననుకప్పమిడ
గవలయు। యరినల్పదళమైన దండెత్తగాదగు తొలగిదాగినపు
పోదోలవలయు। యుద్ధరైనను భేద మెసగజేయుటయొప్పు కాక
గగ్గోలుగా గదమవలయు। చనకున్నశత్రుపై శత్రుకేడుట లెస్స
యొండెముట్టడిజేసి యుడుపవలయు। రమణనీరీతిదలపోయ రాజ
నీతి। యిట్లునడచిన విభుకీలమెల్ల నేలు॥ కలిత॥ *

(౭౯.) సీ॥ దయతోడదీనుని దైన్యంబుబాపుట చెడినమానవుని రక్షించు
కొనుట। పేదకునర్థంబు పిల్చిదానిచ్చుట కడచనునాతురుని గాచి
కొనుట। శరణుజొచ్చినవాని చనువిచ్చిమనుచుట యెదుటబడ్డయ
నాధ నేలికొనుట। చంపదెచ్చినవాని చావుమాన్పించుట యగతి
కుండగురోగి నరసికొనుట। యింతకంటెను పుణ్యంబు లెందుగల
వు। ధరణిపతులకునరయ భూతలమునందు॥ కలిత॥ *

(౮౦.) సీ॥ పతికిమారాడక పలుమారు నేవ్వక యలుగకమిగుల గయ్యాళి
గాక । తనుదిట్టుకొనక కాంతాళించి గొణగక ముచ్చిలించక పా
పమునకు జొరక । పొరుగింటికేగక పరునాత్మ దలచక కుపిత గాక
పరానుకూలి గాక । అదవ దాచక మర్మ మావల జెప్పక బొంకకక
దునిద్ర బోతుగాక । కాపురము జేయు కోమలిగల్గెనేని । పల్కనే
టికిపురుషుని భాగ్యమహిమ॥ కలిత॥ *

(౮౧.) సీ॥ ప్రాణంబుతోలంకె పాటివ్రతసతి ధనరుణంబునలంకె తనయు
డరయ । సుఖదుఃఖములలంకె పొందితల్లియుదండ్రి పాలికి లంకె
లుభ్రాతలెందు । భువినూనరుణంబునకులంకె మరంది మేలతని
య్యానులంకె మేనమామ । మేలుమీదటలంకె మిత్ర వర్గంబెల్ల వా
ర్షంబునకు లంకె యల్లుడరయ । వారివారికితగినట్టి వరుసదెలిసి;
నడువవలయును యజమాను డైనవాడు॥ కలిత॥ *

(౮౨.) సీ॥ ఇహముసాధించుట యిలకీర్తి వడయుట సర్వంబు దెలియుట
చదువుకొనుట । యనుభవించుటభోగ మఖిలపూజ్యుండౌట నిధులు
పెట్టుటకార్య నిపుణుడగుట । యర్థమార్జించుట యధికులతో సఖు
డౌట నుతికెక్కి బ్రతుకుట చతురుడగుట । పుత్రుల గాంచుట పు
ణ్యంబు జేయుట మురహరుగొల్చుట ముక్తిగనుట । యిట్లుమెలగని
నరుజన్మమేమిభాతి । సజ్జనులు నేతురిటువంటిసరణి దెలియ॥ కలిత॥

(౮౩.) సీ॥ ఏనుగలావెంత యిలమావటీడెంత తిమిరంబుబలిమెంత దీపమెం
త । ఘనసముద్రంబెంత కలశధారకుడెంత బహుకాననంబెంత పర
శువెంత । పాదెదునీరెంత ప్వ్రతంబది యెంత హరుడెంత నృపుల
కుప్పాస్త్రమెంత । భీకరఫణియెంత వాకట్టువేరెంత బహురాజ్య
మెంతభూపాలుడెంత । యెవ్వరికిదొడ్డు కొంచంబు లెంచవలదు।
నడచునిటువంటి నీనామకములు భువిని॥ కలిత॥ *

(౮౪.) సీ॥ పెంచంగ పెరిగెనా పృథ్విపై కొండలు విత్తిరా యడవుల విత్తన
ములు । కాల్వలు గట్టిరా ఘనసముద్రములకు యేతంబులెత్తిరా వాదే
రులకును । మేతలు బెట్టిరా మృగములకెందైన మఱియీత నేర్పిరా
మత్స్యములకు । పెండ్లిండ్లు జేసిరా పెనగపత్తులకును పూశిరా వా
సనల్ పుష్పములకు । యెవ్వరెవ్వరి పోషించి రెంచిచూడ । వరుసనీ
దైవరక్షకత్వమునగాక ॥ కలిత॥ *

(౮౫.) సీ॥ శక్తికితగనిదుర్గమము శాయగరాదు చదువకతర్కింప జన
దుసభల । యేనుగతోవ్వ చేలాటమాడంగ యెనయని బాంధవం
బెందువలదు । వపులేనట్టి యాశ్రయము శాయగరాదు నోగినుప
ద్రవభూమినుండరాదు । గడుసరిలోభిని యడుగుట కష్టంబు దైవం
బుమీది క్రోధంబు జెల్ల । దెంతమాత్రంబు దనశక్తి యంతమాత్ర । మ
రశియొనరించు నాతండె పురుషుడెందు ॥ కలిత॥ *

(౮౬.) సీ॥ గాడిదెమోయుగునా గంధంబువాసన లేదూరపందికి మొదలరో
త । వాడకోడికి నాదివారంబు వలువదు కోతికి మరితాల్మి గుణము లే
దు । చిరతల కేటికి శీలవంతులయున్కి యెద్దటుకులచవి యేమియె
ఱుగు । వరుసతో కుక్క దేవర బోన మెరుగదు మొసలికి పడిశంబు
మొదలలేదు । సహజమూఢులు యిటువంటి జాడవారు । వారిగుణ
ములు దిద్దంగ పశము కాదు॥ కలిత॥ *

(౮౭.) సీ॥ పాలియించు దయ్యంబు పుణ్యంబులెంచునె భయపడవారల బట్టు
గాక । పాడునెజితము వెంబడి దంచనపుగుండ్లు తనసూటి దప్పక
దాకుగాక । చిచ్చెంత పెరిగిన శింగారమెరుగునె తనుగాలి పైపున
తగులుగాక । తొలకరివానలు దొరతనంబెంచునె తగిలి వాకిటను
న్నతడుపుగాక । నీవు నేర్పిన మహిమలెనదియు । నెల్లనెట్లు గావ
లెనెవ్వరి కట్లనుండు ॥ కలిత॥ *

(౮౮.) సీ॥ భూమియుదేహంబు పోలించిచూచిన రాజుప్రాణంబు శ్యాంర బు శిరసు। కడియించినధనంబు ఘనతరాయుష్యంబు మతిసత్ప్రి ధానిధర్మంబుతోడు। కరిచరణాదులు కరితురంగంబులు ఘనవిచా రమునీతి కరుణదెలియ। బలువైనదుర్గ ముల్ షంచేంద్రియంబులు స రవిచైతన్యంబు సర్వబలము। కాల పురుషుండవై నీవు ఘనత మెరశి। శేయుచుందువురాజ్యంబు చెలగిచెలగి॥ కలిత॥ *

(౮౯.) సీ॥ ధరలోనయావులు తమదూడలకు నెల్ల పెట్టెనామేతలు ప్రియము తోడ। బొక్కలుత్రవ్వించి బోమెనానక్కలుతమపిల్లలకునిరంత రమునుండ। తలగన్నప్రికినీరు తాగదూనలకును కట్టెనాచెరువులు క ప్పలెల్ల। ప్రియముతోరతిసల్పి బిడ్డలుగనుమని చెప్పెనాసింహముల్ శిశువులకును। వట్టిభ్రిమతల తమపుత్రవర్గములకు। తల్లిదండ్రు లువలతురు ధనముగూర్ప॥ కలిత॥ *

(౯౦.) సీ॥ ముదిమితీగలుదారి ముంచినదైవరి కడుమేన నరములు గాను పించు। తనమేనుగనుగొని తానునవ్వెదుక్రియ మీసముల్ గడ్డ బు మిగులనెరయు। పంచేంద్రియములకు పరగనోర్చితినని వెన్నుచూపి నమాడ్కినీవువంగు। యుప్పతిల్లినధన ముబ్బతీశీరీతి నేర్పడుచుబు వులైయెమ్మెలెల్ల। యిట్టిజరచాత చిక్కినయట్టినరుడు। మనసుద నియగభోగింప మనసుబెట్టు॥ కలిత॥ *

(౯౧.) సీ॥ అర్థంబుదేహంబు యాచార్యుసొమ్మని యాయాజ్ఞదప్పకయాస్త గలిగి। తగినశిశ్రూషకు తనువలవడజేసి మతిగల్గి యేప్రొద్దు మంపు విశిచి। యుపదేశమిచ్చిన యూహలుదలపోసి యాహారనిద్రల కాస పడక। వేసరకాత్మలో విశ్వాసమెడలక హరిభక్తి గురుభక్తిసధి కముగుచు। నన్నయాతడుశిష్యుండు నుర్విమీద। పరగశుభమూర్తి యతిలోకపావనుండు॥ కలిత॥ *

(౯౨.) సీ॥ దైవంబుగురుఁడును ధరఁగలండనినమ్మి తలపోసిమనుటయుత్తమ
గుణంబు । కలదువేదముముక్తి కలదుపుణ్యంబని మరిభక్తిసేయుట మ
మంచితనము । యజ్ఞాదికర్మంబు లెల్ల ప్రపంచంబు సత్యంబు లను
టనిశ్చలమతంబు । హరినారాయణేజికిఁ నాతడెసర్వజ్ఞుఁ డనిభజించు
టయది యాదిమతము । చదివితెలిసిన పెద్దల సమ్ముఖమున । నెరు
గునతఁకి సఫలమౌ నీమతంబు॥ కలిత॥ *

(౯౩.) సీ॥ ఉచితకార్యము రాజు యొకపరివినకున్న మరియు జెప్పఁగదగు
మాన్యులకును । తగవెంచ కలిక తన్నుకోపించిన యెగ్గుబెట్టఁగరా
దు హితునకెపుడు । తన విభుం డొకపరి తప్పుగాఁజేసిన యమర
కాయఁగవలె నాప్తునకును । మరచినయధిపతి మనసులో పనులెల్ల
నెచ్చరించఁగవలె నిష్టులకును । సచివునకుబోదు పతికినీచందమునను।
హితముగోరుచు నీరీతి నెనయవలయు॥ కలిత॥ *

(౯౪.) సీ॥ ఆకలియటుమాని యట్లుండ నిచ్చునె పిండివైనను దినుపించు
గాక । శీతోష్ణములుకడు శిగ్గుకోసిల్పునె ప్రేమకంబళము గప్పించు
గాక । సరసకామముబ్రహ్మచర్యంబునిల్పునె పొంచియొకచోతె తగి
లించుగాక । కోరియాసలుమంచి గుణములునేర్పునే పరిచర్యలకు
నొడంబరచుగాక । యెంతవారికిపంతంబు లెట్లుగల్గు । మీకుశర
ణనిబ్రతుకుటే మిగులనేర్పు॥ కలిత॥ *

(౯౫.) సీ॥ కుశలుడైప్రతిమచే కొనితీర్చఁగుగాక తనరూపు చక్కదిద్దంగ
రాదు । మగుకలకలపించు మందుగల్గెడుగాని మరిదుర్గుణము మా
న్పమంచు లేదు । కొత్తగానొకజన్మ మెత్తంగఁగుగాని మరి పూర్వ
దేహంబు మగిడి రాదు । కొల్పులుకృషిజేసి కూర్చంగఁబడుగాని భు
జియించినది గాదె బోయరాదు । దైవకృత్యంబులివి యాల దప్పని
చ్చు । పురకెలోకులుభ్రాంతిశే యుదురుగాక॥ కలిత॥ *

(౯౬) సీ॥ సరకులు గొనవచ్చు సాధించి తేవచ్చు కోరి సుజ్ఞానంబు కొనగ
రాదు। తపముశాయగవచ్చు ధనముగూర్పగవచ్చు భువిసగ్రజన్మ
డై బుట్టరాదు। కాశికిబోవచ్చు క్రమ్మరరావచ్చు తెలిసి సుషుమ్న
భేదింపరాదు। మౌనిగావచ్చు నేమములుజూపగ వచ్చుపా కెడుమ
నసు నిల్పంగ రాదు। నేర్పునేగతినెవ్వరు నేర్పిరైన। సరవితో బ్ర
హ్మవేత్తల సరికిరారు॥ కలిత॥

(౯౭) సీ॥ ప్రియముతో భుజియింప పిలవనివారింట కడువమి యదియొక్క
కోటి శేయు। తనను దాసీను గా దలచువారింటికి కోరి పోకుండుటె
కోటి శేయు। తగనిచుట్టంబింట తగిలికన్యక జెచ్చుకొనక యుండు
టయొక్క కోటిశేయు। తనకు పకారముల్ తగిలి జేసినవారి కోర
కుండుటయొక్క కోటిశేయు। యొనరయిటువంటి వె　　ర్పిమీ
ద। నేర్చినడచిన వారలె నీతిపరులు॥ కలిత॥ *

(౯౮) సీ॥ అతివేగ కపటాత్ము డాదరించుటకన్న నెనరైనవాడు తిట్టినను
మేలు। రోయ తిట్టుచు బెట్టు పాయసాన్నముకన్న భక్తిచే బోయు
నం బలియు మేలు। యలయించి తాపకు లైదులిచ్చుటకన్న యపు
డొకరువ్వయిచ్చి నను మేలు। పలుమారు ద్రిప్పి తా పలుచనాడుట
కన్న యపుడొక మాటలే దనుట మేలు। పలవ పిండ్లా ము బంగరు
ప్రతిమకన్న। యతిగుణావతి నల్లని దైన మేలు॥ కలిత॥ *

(౯౯) సీ॥ కాంచనపావలు గజ్జలునందియల్ కడుమించుమోహచంద్ర కా
విఘట్టి। పీతాంబరంబును బిళ్ళలమొలనూలు బిగియించికట్టిన ాను
కటారి। వరదానకంము నుజ్జ్వలద -డహ స్తంబు పటుశంఖచక్రో
రు బాహుయుగము। యొరపైననాభియు నుదరబంధంబును యల
మేలు మంగతో హారములును। శిరసుమకుటంబు తిరుమణి చిత్రము
కర। కుండలంబులు గలమిమ్ము కోరికొల్తు॥ కలిత॥ *

(౧౦౦.) సీ॥ మాధవగోవింద మధుసూదనాచ్యుత వామనప్రద్యుమ్న వాసు
దేవ। కృష్ణదామోదరకేశవ శ్రీధరహరివిష్ణు పురుషోత్తమానిరు
ద్ధ। సంకర్షణాధోక్ష జత్రివిక్రమపద్మ నాభ జనార్దన నారసిం
హ। శౌరిహృషీకేశ నారాయణోపేంద్ర తా లాంకముఖ నామతా
ళ్లపాక। యన్నమాచార్యసుతచిన్న నాహ్వయుండ। ప్రణుతిఁజే
సితిగైకొమ్ము పద్యశతము। కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ విమలరవి
కోటి సంకాశ వేంకటేశ॥ *

సీ॥ శ్రీవేంకటేశనీ చరణ సేవకుఁడయిన యలతాళ్లపాక చిన్నన్న
గారు। యింపులుగులుకఁడు నీసీసశతకంబురచియించె విబుధులౌ
రాయనంగ। సలకాన్వయాంబుధీ సదమల చంద్రుఁడు శ్రీనివాసా
ఖ్యుండు చెన్నుమీర। శ్రీకాకుళార్యుల స్వీయ ముద్రాయంత్ర భవ
నంబునందు సుబద్ధముగను। రత్నములనేర్పరించెడి రసికతఁభువి। దె
లియ ముద్రించెదివ్యులు దెసల బొగడ। కలితలక్ష్మీశ సర్వజగన్ని
వేశ విమల రవికోటిసంకాశ వేంకటేశ॥ *

వేంకటేశ్వరశతకము,

సంపూర్ణము.

---



---

౧౮ పేజి- ౮౮ గో పద్యములో మొదటిబంతి (చెలగిపుణ్యుని జేరి చిరకాల
మునుబ్రతుకు)—అనుటకుబదులుగా.— (చెలఁగియొక్కని జేరదినవాని బ్రతుకును)
అనివుండవలయును.

శ్రీః

# ప్రకటన.

ఇందువలన సకలమైనవారికి తెలియచేయునది

ఏమనగా



స్వయంప్రభాచరిత్రము శ్రీరాములవారి ఆజ్ఞానుసారము ఆంజనేయులవారు, సీతాదేవిని వెదకుటకు పోవుకాలమున సముద్రమువద్ద పర్వతగుహలో చూచిన (స్వయంప్రభ) అనెగుహలోవుండిన స్వయంప్రభ యుద్ధానంతరము శ్రీరామచంద్ర దర్శనముచేసి స్తోత్రముచేయుట పోవుచునది కైలాసమునందు పార్వతీ సమేత సాంబశివునివలన వరమునుపొంది కనకపురి వణిజానాదులుగలది యిదియొక్కృష్ణావతారమున (రాధగా) జన్మించుటకు హేతువులనుజూపు శృంగారయోగభక్తి రస యుక్తంబగునది అచ్చొయ్యుచున్నారము.

పూర్వకవులచరిత్రము తొలిభాగము రంగనాథ మంత్రిభాస్కర ముళక్కిభాస్కర నన్నయభట్టు తిక్కన సోమయాజి యజ్ఞాప్రగడల చరిత్రములుగలది. ౦-౪-౦-

౨. వభాగమునందు శ్రీకృష్ణదేవరాయలు అల్లసాని పెద్దన్న ముక్కుతిమ్మన్న భట్టుమూర్తి కంసాలభద్రయ్య వీరికథలు గలవి. (౦-౪-౦-

౩. వభాగమునందు పిల్లలమర్రి పినవీరభద్రయ్య తెనాలిరామకృష్ణుడు వీరిచరిత్రలు. ౦-౪-౦-

ఆంధ్రవర్ణగణమను పాటలపఠము. ౦-౧-౦-

జీవన్ముక్తిఅనే పరమపదక్రీడాపటము పాచికలు ౩- సహా. ౦-౬-౦-

యిదియుగాక సంస్కృతాంధ్ర గ్రంథములు వలయువారలు చెన్నపట్టణము పెద్దినాయకునిపేట సీనుమొదలివిధి (౭) వ- నెంబరుగలస్వగృహమునందుండుమాకువ్రాశి తెప్పించుకొనవలయును.

వాల్యూపేబిల్ గా పంపబడను,

ప౦. శ్రీకాకుళాచార్యులు అండుబ్రదర్సు.